ఉండగా, .... అద్దానిచే ప్రకాశింపబడుచున్న ఈ దేహము, ఈ చిత్తము, వాటి వాటి చేష్టలు, సమస్త లౌకిక – వైదిక క్రియలు వర్తిస్తున్నాయి.

అంతేకాకుండా... బంగారముచే చేయబడ్డ ఉంగరము – గాజులు – జడబిళ్ళ – గొలుసు – భుజకీర్తులు – వడ్డాణం మొదలైన వేరువేరు ఆభరణములన్నీ బంగారమే కదా! ఆ విధంగా బంగారంలో వివిధ ఆభరణములు స్ఫురిస్తున్నట్లుగా .... పరమాత్మ యందు ఈ వివిధ నామ – రూప సమన్వితమైన జగత్తు స్ఫురిస్తోంది. తరంగాలు వేరువేరైనా అన్ని తరంగాలలోని జలం ఒక్కటే కదా! అనేక దేహములలోని దేహి ఒక్కటే! ఈ కనబడే దృశ్య జగత్తంతా పరమాత్మ స్వరూపమే అయివున్నది. ఇది పరమాత్మ కంటే ఒక అణువు కూడా భిన్నం కాదు. పూర్ణమగు ఈ జగత్తు పూర్ణమగు పరమాత్మ యందే నెలకొనియున్నది.

**యథా ప్రాప్తోఽ నువర్తామి, కోఽలఙ్ఘయతి సద్వచః?**

మహాత్మా! అగస్త్య మహామునీ! ఈ విధంగా నిశ్చయించుకున్నవాడినై యథా ప్రాప్తములైన కర్మలు నిర్వర్తించెదను. తమవంటి సజ్జనుల సద్వచనములు నాకు శిరోధార్యం! ఎవరైనా మీ వంటి పెద్దల ఆజ్ఞ ఎట్లా ఉల్లంఘించగలరు?

**భగవన్! త్వత్ ప్రసాదేన జ్ఞాతజ్ఞేయోఽస్మి సంస్థితః**
**కృతార్థోఽహం సమస్తేఽస్తు దండవత్పతితో భువి!**

మహాత్మా! తమ అనుగ్రహంచే నేనిప్పుడు 'జ్ఞేయము' అగు ఆత్మను ఎరిగినవాడనైనాను. కృతార్థుడనైనాను. అనేక దుష్ట సంకటముల పరంపరలకు త్రోవతీయగల సంసారము నుండి నన్ను ఈనాటికి పరిరక్షించిన తమకు భూమిపై సాష్టాంగ దండ పూర్వకమైన ప్రణామములు సమర్పించు కుంటున్నాను. పరమ పురుషార్థప్రదమగు ఆత్మజ్ఞానమును ఉపదేశించిన గురువుకు... అట్టి మహోపకారముతో సమానమైనది ఏది శిష్యుడు ఇచ్చుకోగలడు? అందుచేత నా మనోవాక్కాయ కర్మలచే ఆత్మనివేదనము గావించుకొంటున్నాను. ఈ జగత్తులో 'నాది' అయినదంతా తమకు సమర్పించినదిగా అగుగాక! "ఆత్మ నివేదనము"చే అంతటా ఆత్మగాను, అంతా ఆత్మగా దర్శించువాడనై మీ ఆశయమును మీవాక్య సారాంశమును నెరవేర్చగలగటమే... మీకు గురుదక్షిణగా నా నుండి సమర్పించబడుచున్నదై ఉండుగాక! అప్పుడే కదా గురువుకు తృప్తి!

స్వామీ! తమ అనుగ్రహంచేత సంసార సముద్రమును దాటి వేసిన వాడనైనాను. నా యొక్క పూర్ణానంద రూపముచే బ్రహ్మాండ సమూహమునంతా ముంచివేయుచు వెలయుచున్నాను.

❖

**యత్సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి చ స్ఫుటమ్**
**శ్రుత్వా హ్యుదీర్యతే సామ్ని, తస్మై బ్రహ్మాత్మనే నమః ॥**

ఏ బ్రహ్మము సామవేదముచే (సర్వం ఖల్విదం బ్రహ్మ – తజ్జలానితి శాంత ఉపాసీత – ఈ ప్రపంచమంతా బ్రహ్మమునందే లయించుచున్నది అని) గానము చేయబడుచున్నదో... అట్టి ఆ

బ్రహ్మమే ఈ జగత్తు. అట్టి బ్రహ్మమే ముముక్షువులందరికీ (ఎవరు ఏ పేరుతో పిలిచి నివేదనము సమర్పించినా సరే) ... ఉపాసనా వస్తువు అయివున్నది. ఈ విషయం శ్రుతి – స్మృతి ప్రవచనముల సారవాక్యమే అయివున్నది. అట్టి బ్రహ్మమునకు నమస్కారం.

**బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం జ్ఞానమూర్తిం,**
**ద్వంద్వాతీతం, గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం**
**ఏకం, నిత్యం, విమలం, అచలం, సర్వధీసాక్షి భూతం**
**భావాతీతం త్రిగుణ రహితం శ్రీ వసిష్ఠం నతాః స్మః ॥**

బ్రహ్మానంద రూపులు, జ్ఞానోపదేశముచే ఆత్మ సుఖమును ప్రసాదించువారు, కేవలము జ్ఞాన స్వరూపులైనవారు. ద్వంద్వములన్నిటికీ అతీతులైనవారు, ఆకాశమువలె నిర్మల – అఖండ స్వరూపులు, "ఓ బిడ్డా! నీవే బ్రహ్మమవు" అనే ఆశయమును కలిగియుండి ప్రతివాక్యము బోధించువారు, ద్రష్టలందరి యొక్క ఏకైక స్వరూపులు, భూత – వర్తమాన – భవిష్యత్తులందు యథాతథమగు అఖండాత్మ స్వరూపులు, అత్యంత నిర్మల స్వరూపులు, సర్వచలనములకు ఆధారభూతమై తాను మాత్రము చలనాదులు కలిగియుండనట్టి నిశ్చల – కూటస్థ స్వరూపులు, సమస్త ప్రాణులయొక్క బుద్ధివృత్తులకు సాక్షి అయినవారు, భావముల కంటే ముందే ఉన్నట్టి భావాతీత స్వరూపులు, త్రిగుణములచే స్పృశించబడనివారు అగు... వసిష్ఠ మహర్షి స్వరూప పరబ్రహ్మమునకు మేమందరము నమస్కరించుచున్నాము.

❖❖❖

# నిర్వాణ ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు – లోక కళ్యాణమస్తు

ఓం తత్సత్

❖❖❖

## శ్రీ వసిష్ఠ - రామ సంవాదము
## (యోగవాసిష్ఠము - అఖండ రామాయణము -మహా రామాయణము)
## సంపూర్ణమ్

❖❖❖

శ్రీ సద్గురుభ్యోం నమః

ఏ పరమాత్మ రామ – కృష్ణ – శివ – యహోవా – అల్లా – బుద్ధ – సాయి – ఈశ్వర – పరమేశ్వర – లలిత – అనసూయ ఇత్యాది అనంతనామ స్వరూపుడై ఆరాధించబడుచున్నారో... అట్టి సర్వాత్మకుడు – అస్మత్ స్వరూపుడు అగు పరాత్పరునకు ఆయన కిరణ స్వరూపుడనగు నేను ఆత్మ నివేదనపూర్వకంగా ఈ సర్వము సమర్పించుకుంటున్నాను.

సర్వ జనులకు శుభమగు గాక!

ప్రపంచ శాంతి వెల్లివిరియునుగాక!

ప్రేమాస్పదుడగు పరమాత్మను సర్వే సర్వత్రా దర్శించు మహనీయుల పాదపద్మములకు ఈ నా నమస్కార కుసుమము స్పృశించునుగాక!

'బ్రహ్మానంద స్వరూపులు – మమాత్మ స్వరూపులు అగు పాఠక మహాశయులు చదివి – విని ఆత్మానందభరితులయ్యెదరుగాక!'

లోకకళ్యాణమస్తు

ప్రపంచశాంతి వెల్లివిరియునుగాక!

**ఆపదాం అపహర్తారమ్ దాతారం సర్వసంపదామ్ ।**
**లోకాభిరామమ్ శ్రీరామమ్ భూయో భూయో నమామ్యహమ్ ॥**

❖❖❖

**కృతార్థోస్మ్యహమ్, దండవత్ పతితోభువి యేలేశ్వరపు హనుమ రామకృష్ణ**

❖❖❖

**॥ శ్రీరామకృష్ణార్పణమస్తు ॥**

❖❖❖

ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విద్యలు ప్రదర్శించి పూజింప బడాలని, జనులను ఆకర్షించాలని తమ అజ్ఞానం చేత ప్రయత్నించేవారు కొందరు ఉంటారు.

అయితే... "మంత్రము - ఔషధము" మొదలైన వాటి బలంచేత ఆకాశ గమనము, సుదూర దర్శనం మొదలైన విద్యలు అజ్ఞానులకైనా సిద్ధించవచ్చు. ఎవడు దేని కొఱకై క్లేశాదులను సహించి ప్రయత్నిస్తాడో... ఆతడు ఆయా విశేషాలు కాలక్రమంగా తప్పక పొందుతాడు. అట్టి విశేషాలు జ్ఞానికైనా, అజ్ఞానికైనా సిద్ధిస్తాయి. కాబట్టి అట్టి భౌతిక విద్యలను చూచి ఒకడు జ్ఞాని అని గాని, అజ్ఞాని అని గాని మనం నిర్ణయించలేము. గంధపు చెక్కలో చందన సుగంధం అంతర్గతంగా ఉన్నట్లే... సర్వుల హృదయాలలో వారు నిర్వర్తించియున్న విహిత - నిషిద్ధ కర్మఫలములు ఉండనే ఉంటాయి. అని అయా కాలానుగతంగా ఆవిర్భవించి ఆ కర్తను ఆశ్రయిస్తాయి. కర్మల గతి అట్టిది. లోకంలో ధనాదుల వంటివే సిద్ధులు కూడా! ఎవనికైతే దృశ్యరూపాలే అయినట్టి సిద్ధులు మొదలుగా గల ఆయా వస్తు వ్యవహారముల పట్ల "ఇవి నేను కూడా పొందాలి" అనే ఆకాంక్ష - ఆవేశము - అభినివేశము పెంపొందుచున్నదో... అది సంసార రూపమే సుమా! "ఈ ఆకాశగమనాది సిద్ధి సమూహమంతా కేవలం మనస్సును భ్రమింపజేసేవి, అల్ప విషయములు మాత్రమే" అని ఎఱిగి ఎవడు చిదాకాశమునందే లక్ష్య శుద్ధి కలిగి ఉంటాడో... అట్టి వాసనారహితుడగు తత్త్వజ్ఞునకు వాటి పట్ల అభినివేశముగాని, దంభముగాని ఎందుకు ఉంటుంది?

**వసిష్ఠ మహర్షి**

**పుట : 522**

CONQUER YOURSELF

ISBN 93-83972-14-2 (Set)

**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు-29

email : publication@rkmath.org

www.rkmath.org

Vasishta Rama Samvadam : Vol 4

ISBN 93-83972-13-5 ₹ 1000/- (set)